# కాలుతున్న ధాన్యపు పొలాలు

రచన: సారా కోన్ బ్రయంట్
చిత్రాలు: మామొరు ఫునాయి
అనువాదం: రోహిణి చింతా





# కాలుతున్న ధాన్యపు పొలాలు

రచన: సారా కోన్ బ్రయంట్
చిత్రాలు: మామొరు ఫునాయి
అనువాదం: రోహిణి చింతా



చాలా కాలం క్రీతం, జపాన్లో ఒక వృధుడూ,తన మనవడూ, కొండపైన చదునుగా ఉన్న సారవంతమైన భూమిలో పెరుగుతున్న ధాన్యపు పొలాలను కాపలాకాసేవారు. ఆ ధాన్యపు పొలాలు కొండా దిగువున గ్రామంలో ఉండే జాలర్లవి.



సముద్రం గ్రామానికి ఎంత దెగ్గరగా వచ్చిందంటే, ఆ కొండదిగువున ఇళ్లకు తప్ప మరి దేనికీ చోటులేదు. అంచేత ఆ జాలర్లు వాళ్ళ ధాన్యాన్ని ఆ కొండపైన నాటి, ఆ విలుపైన ధాన్యాన్ని కాపలాకాయమని ఆ వృధుడనీ, అతని మనవడినీ అడిగారు.

ఒక రోజు ఆ వృధుడు సముద్రాన్ని చూసినప్పుడు, అతనికి ఎటువంటి విషయం కనిపించిందంటే, అతను బిగ్గరగా అరిచాడు. అతడు అతని కాళ్లపై చేయి పెట్టి తీక్షణంగా మళ్ళీ చూసాడు. పిమ్మట అతను మనవడిని చూసి “పరిగెత్తు! పరిగెత్తి ఇంటికి వెళ్లి నాకొక కాలుతున్న కొయ్యని తీసుకురా!” అని అరిచాడు.





ఆ పిల్లవాడు అతని తాతయ్య అంత పదునుగా మాట్లాడడం మునుపెన్నడూ వినలేదు. అతను  భయపడిపోయాడు. అయినాసరే, అతనికి చెప్పబడినట్టుగా పరుగు పరుగున ఇంటికి పోయి, పొయ్యలోనుంచి ఒక కాలుతున్న కట్టెను లాగాడు. పిల్లవాడు తిరిగి వచ్చాక ఆ వృధుడు పిల్లవాడినుంచి ఆ కొయ్యను లాక్కుని, ఆ ధాన్యపు పొలాల మధ్య పరుగెడుతూ, ఆ పండిన, ఎండిన ధాన్యాన్ని తగలపెట్టడం ప్రారంభించాడు.



క్షణాలలో ఆ ధాన్యపు పొలాలలో పెద్ద మంటలు చెలరేగాయి. మంటలు చిటపటలాడుతూ ఆ ఎండు గడ్డిపై పాకాయి. భయంకరమైన పొగ కొండపైకి లేచింది.

“తాతయ్యా , తాతయ్యా” అంటూ ఆ పిల్లవాడు ఏడ్చాడు “ఏం చేస్తున్నావు? ఆపు తాతయ్యా! దయచేసి ఆపు!”.



గ్రామస్థులు పైకి చూసేసరికి, వారి అమూల్యమైన ధాన్యపు పొలాలు కాలిపోతూ కనిపించాయి. ఆ! వారు ఎలా పరిగెట్టారనుకున్నారు. మంటలు ఆర్పటానికి మగవారూ, ఆడవారూ, పిల్లలూ అంతా కొండపైకి ఎగబాకారు. గ్రామంలోని ప్రతిఒక్కరూ వెళ్లారు. ఒక్కరుకూడా గ్రామంలో ఉండలేదు.



ఇక కొండపైకి వచ్చాక, కాలిపోతున్న ఆ ధాన్యం పొలాలను చూసి, వారు ఆక్రోశంతో “ఇది ఎలా జరిగింది?” అని అడిగారు.

“నేనే నిప్పు పెట్టు!” అని ఆ వృధుడు గంభీరంగా అన్నాడు. “అవును” అన్నాడు ఆ చిన్నపిల్లవాడు “తాతయ్యే నిప్పు పెట్టారు!”.

ఇది విన్న గ్రామస్థులకు బాగా కోపం వచ్చింది. వారు ఆగ్రహంతో “ఎందుకు? ఎందుకు?” అని అరుస్తూ ఆ వృద్ధుడిని చుట్టుముట్టారు.

ఆ వృద్ధుడు ఎంతో ప్రశాంతంగా “చూడండి” అని సముద్రంపైపు చేయి చూపాడు.





గ్రామస్తులంతా తిరిగి చూసారు. ఎక్కడైతే గంట ముందు అలలు నెమ్మదిగా ఆటలాడాయో, అక్కడ ఇప్పుడు ఒక పెద్ద గోడవంటి ఆలా పొంగుకొస్తోంది. ఆ దృశ్యం ఎంత భయంకరంగా ఉందంటే, ఎవరి నోటా మాట రాలేదు.



ఆ సునామి నీటి ఆల గ్రామం మీద విరుచుకుపడి ఇళ్లను ఎత్తి గాల్లో విసిరి కొట్టింది. ఆల తరవాత ఆల కొండవారను ఢీ కొట్టింది. కొంతసేపటికి అంతా సద్దుమణిగిపోయింది. అంతా ప్రశాంతంగా ఉంది. గ్రామం సముద్ర గర్భంలో కలిసిపోయింది.

ఆ వృధుడు చేసినదేమిటో గ్రామ ప్రజలు కనిపెట్టాక, అందరికంటే ఎక్కువగా అతనినే గౌరవించి ఆదరించారు.



